నాజర్

# పల్నాటియుద్ధం

విజయవాడ, 1945

Record no. 101

Nājar

Palnāṭiyuddhaṃ

Vijayavāḍa, 1945

Record no. 101

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

నాజర్.

పల్నాటియుద్ధం : బుర్రకథ / నాజర్. - విజయవాడ : సాహిణీ పబ్లికేషన్స్, 1945.

(2), 27 p. ;17 cm.

Record no. 101

Nājar.

Palnāṭiyuddhaṃ : Burrakatha / Nājar. - Vijayavāḍa : Sāhiṇī Pablikēṣans, 1945.

(2), 27 p. ;17 cm.

Record no. 101

35 mm microfilm

Image placement: IA IIA IB IIB Date filming began:

## మనవి

యిది నా తొలి రచన.

యీ కథా రచనకు ప్రోత్సహించి రచనా విధానంలోకూడా చేయూత నిచ్చిన శ్రీయుత ప్రయాగ కోదండరామశాస్త్రిగారికి, యీకథ రాణించేందుకు అన్నివిధాలా సహకరించిన మిత్రులు రామకోటి, పురుషోత్తం, లక్ష్మీనరసయ్య గారలకు, పోషిస్తూ వున్న ఆంధ్ర ప్రజానీకానికి, ప్రచురించిన సాహిణీ పబ్లికేషన్స్ వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

— నా ఖ ర్

## అంకితం

నా అభివృద్ధికి తోడ్పడిన

ముఖ్యులలో ముఖ్యుడయిన

నా

పురుషోత్తానికి

# తొలిపలుకు

ఇది బుర్రకథలో నాజరు యుగం. బుర్రకథ చెప్పడంలోనే గాక కథారచనలో కూడా నాజరు అందెవేసిన చెయ్యి.

పల్నాటియుద్ధం నాజరు తొలి రచన. ప్రజా నాట్యమండలి ఆవిర్భవించిన క్రొత్తలో అనగా 1945 లో నాజరు ఈ కథని రచించి చెప్పడం ప్రారంభించాడు. నాజరు దళంవారు గత నాలుగు సంవత్సరాలలో 240 సార్లు ఈకథ చెప్పి సుమారు 5 లక్షల మంది ప్రజానీకాన్ని ఉద్రూత లూగించారు. యుద్ధాల వల్ల కలిగే అరిష్టాలను విశదీకరించడంద్వారా శాంతి ఉద్యమాని కెంతో తోడ్పడ్డారు. ఇలాంటి ఉత్తమ రచనను ప్రచురించ గలిగినందు కెంతో గర్విస్తున్నాం.

— ప్రకాశకులు

# ప్రార్థన

శ్రీ భారతమాతా
మాంపాహి జనహిత

సంపూర్ణా స్వారాజ్యాకాంక్షీ
సుఖశాంతికి మకుటంబగు
సూవిశాల సమభావ సమన్వితపూజిత ॥సా॥

వందలాది ప్రవహించెడి వరనదులే
వింధ్యా హిమశైలములే
బంగరు పొలములతో నలరారెడు
అందచంద బృందావనవాసిని ॥సా॥



సోదరభారత వీరుల్లారా ॥తందా॥
వీరమాతలౌ వనితల్లారా ,,
శ్రీగల భారతమాతను దలచి ,,
శ్రీనాధుని పోతన్ననుదలచి ,,
కాళిదాస వరకవులను దలచి ,,
భరతశాస్త్ర పండితులను దలచి ,,
జోడుగుమ్మెటలు తాధిమియనగ ,,
తోడుగవంతలు జోరుగపాడగ ,,
రాగతాళ గీతాదినృత్యముల తంబురకథవినుడీ

వ॥ యిప్పటికి 800 ల యేండ్లనాడు జరిగిన యీ పల
నాటి వీరగాథ శ్రీనాథకవిరాజు చంద్రవంకకు జెప్పిన తెరంగున
మనమిచ్చట చెప్పంబూనితిమి. వినేవారు యెట్లావినవలె
నయ్యా ?

స్వతంత్రదీక్షను మనమున నిడుకొని - శ్రద్ధగవినవలెరా
అల్లరిజేయక పిన్నపెద్దలు - ఆలకించవలెరా
వినరాభారత వీరకుమార - విజయముమనదేరా
ప్రాకటముగ నే జెప్పెడికథను - ప్రాజ్ఞులారవినుడీ
శ్రీవిలసిల్లెడి తెలుగుదేశ మకు - టాయమానమైన
వీరగడ్డ పలనాడువన్నెకు - వాసికెక్కినదిరా
వీరులెందరో పుట్టిపెరిగినా - పుణ్యభూమియదిరా
వీరమాతలను గన్నతల్లిరా - మరపురాదు మనకు
వీరయోధులా వేడిరక్తము - విరజిమ్మినసీమ
ధారుణిలో ఆంధ్రావని - పౌరుష మెరిగించినసీమ
కోడెగిత్తలకు పాడిపశువులకు - యీడులేనిసీమ
కోడిపుంజులకు కొమ్ముపొటేళ్ళకు - జోడులేనిసీమ
ఆపలనాడును అనుగురాజు - పాలించుచునున్నాడు
అనుగురాజుకు బ్రహ్మనాయుడు - మంత్రిగనున్నాడు

వ॥ ఇట్టులుండ కొన్నాళ్ళకు అనుగురాజు కాలధర్మ
మొందెను. ఆయనపెద్దకుమారుడు అయిన నలగామరాజుకు
పట్టముగట్టి నలగామరాజు పిన్నవయస్కుండగుటంజేసి బ్రహ్మ
నాయుడే ఆ రాజ్యయంత్రము నడిపెనట. ఎట్లన—



రగడ - పహిడిరాగము

యెక్కువతక్కువ మతవిభేదము - అక్కరలేదనుచు
వొక్కటిగ ప్రజలంధరుండ తా - చక్కగయోచించి
చాకలి, మంగలి, మాలమాదిగ - సర్వజనులకెల్ల
వొకపంక్తిలో విందుభోజనము - యేర్పాటుజేసి
చాపకూటి సిద్ధాంతముపేరిట - సాగించెను ఘనుడు
సాహసియగు యీ బ్రహ్మనాయునకు - సాయపడిరి ప్రజలు
మాలకన్నమను బ్రహ్మనాయుడే - ప్రేమతో పెంచాడు
కన్నమదాసును సేనాపతిగా - జేసెను బ్రహ్మయ్య
తధిగిణతోం—
వర్ణధర్మమను వుక్కుచట్రమును - వ్రయ్యలు జేశాడు
హెచ్చుతగ్గులను రూపుమాపగ - దీక్షబూనినాడు
సర్వమానవ సమానత్వమును - స్థాపన జేయుటకై
ధైర్యముగ ముందంజవేసెనా - ధీరుడు బ్రహ్మయ్య

వ॥ యీ సంఘ సంస్కరణ, హరిజనోద్ధరణ కార్య
క్రమాలు ప్రజలందరు ప్రేమతో ఆదరించుచుండిరి. కాని—

రగడ - మోహన రాగము

పెద్దపెద్దలకు పెత్తందార్లకు - పీకపట్టినయ్యా
గిట్టలేదు యీ చాపకూటి సి - ద్ధాంతము సుతరాము
మట్టిగలిసె కులకట్టుబాటులని - తిట్టుచు లోలోన
కట్టుపంచలను కదలకుండగా - పుట్టగోచిబెట్టి
మొట్టలాగ పైగుడ్డలనే నడి - కట్టులు బిగగట్టి
పట్టినపట్టును విడువమనుచు మీ - సములు పట్టిదువ్వి
ఒప్పుగపెద్దలు పెత్తందారులు - వుజ్జీలు వుజ్జీలున్

చెప్పుకొనుచు బ్రహ్మయ్య దాపునకు - చేరిరి కోపమున
యెప్పుడుపుట్టెనో యీ మతధర్మా - లెందుకు పుట్టినవో
యిప్పుడు వీటిని త్రోసివేయ మే - మొప్పము బ్రహ్మయ్యా
అని యివ్విధమున స్వార్థపరులు బ్ర - హ్మయ్య కెదురుదిరిగె

వ॥ యివ్విధంబున పెద్దపెద్దలు బ్రహ్మయ్యను యెది రించిన సమయంబున—

రగడ-ముఖారి రాగము

సాగినాదిరా నాగులేటి దొరసాని - నాగసాని
అధికారము చేబట్టుట కిదియే - అదనని దలచింది
నాగమకంటిలో ఆశా రేఖే - నాట్యమాడినాదా
కూడదీసె నభివృద్ధినిరోధక - కూటమినంతటిని
అట్టహాసముతో పెద్దలందరిని - దిట్టపరచినాది
వొట్టుసుమా యీ పట్టువిడిలిమా - పుట్టవు నీళ్ళంది

తదిగిణతోం—మోహనరాగము

అని యివ్విధమున పెద్దలందరిని - రెచ్చగొట్టినాద
నాగమాంబ సైన్యాల గూర్చుకొన - వేగమె పూనింద
మాలకూటిరాజ్యమ్ముపోయి తీ - రాలని లేచింద
నివ్వెరపడి ఆ పలనాడంత - నిదురే మానింద

వ॥ నలగామరాజు కిది ప్రాణాంతకము కాగా నాగమ్మతో సంప్రతించి తన ఆస్థానమందు రెండవమంత్రి పదవి నిచ్చెను.

వ॥ యీ నాగమ్మ యెలాంటిదయా—



చిన్ననాడే విల్లుబట్టెరా ॥సై॥
చిన్నప్పై విల్లెక్కుబెట్టెరా ,,
నింగిలాపిట్టనే గొట్టెరా ,,
నీటిలో చేపనె గొట్టిందా ॥భళా॥
అల్లనాడె కత్తిదూసెరా ,,
అల్లపుడె సాములకుడాసెరా ,,
కత్తికదిలే తిరుగాంచితె ,,
కన్నులకు మిరుమిట్లు గొలిపేనా ॥భళానంటి
గుర్రమెక్కి కత్తిబట్టితే
గుర్రానికే భీతిలేదురా
పరవళ్ళతో కెక్కెను గుర్రము
పైపైకిలేచెను గుర్రము
కత్తిఢాలు చేతబట్టెను
బాకుబల్లెము చేతబట్టెను
విల్లనంబులు చేతబట్టెను
పంచకళ్యాణిని యెక్కిందా ॥భ॥
తలతోక కాపాడు కత్తిరా
తళతళా మెరిసేటి కత్తిరా
కాలానికి నాలుక కత్తేరా
శత్రుసేనకు మిత్తేరా ॥భళానంటి
నాగసానిపేరంటేనే పసిపాపలు పాలుముట్టరురా ॥భ॥
నల్లమలలపై నాగమగుర్రము - కదనేద్రొక్కిందా
యెక్కడజూచిన నాగమాంబరా తా యయినాధా

వ॥ యిట్టి ఘటికురాలు నాగమ్మ మంత్రియయిన నాటి నుండి నరసింగరాజుతో నరశింగరాజా ! మీయన్నకు పుత్రులు లేరు; పేరమ్మ వొక్క తేకుమార్తె; రేపు నీయన్న ముద్దులల్లుడైన అలరాజుకు యీరాజ్యమును కట్టబెట్టును; ఎవ్వడు బ్రతికితే వాడె; బాగుగాయోచించుకొనుము నామాట విన్నచో నిన్ను యీ ధరామండలమునకు రారాజును చేతునన దురాశాపరుడైన నరసింగరాజు నాగమ్మకు అండదండ యయ్యెను. నాటినుండి నాగమ్మ—

రగడ–రాగము ధన్యాసి

నాయునిపై కవ్వించి కయ్యమునకు – కాలుదువ్వసాగె
పిన్నపెద్ద అంతర్వు లెరుంగక – ప్రేలజొచ్చినాదా
కన్నూమిన్నూగానక నాగమ – చిన్నమాటలాడ
కరుణామయుడౌ బ్రహ్మనాయునీ – కానిమాటలాడ
కామరాజు కిది ప్రాణాంతకముగ పరిణమించెనయ్య
రోజురోజుకు యింటాబైటా – పోరుమీరెనయ్య
రెండుకత్తులొకవరలో యిమడవని – ఖచ్చితముగనెంచి
చిన్నతమ్ములగు బాలరాజులను – చేరబిలచినాడు

వ॥ తమ్ములారా !

రగడ–ఝుంఝూటిరాగము

బాలలారా మాచర్లసీమ మీ – భాగరమన్నాడు
యేలుకొనుడు బ్రహ్మయ్యమంత్రి మీ – పాలిటి తండ్రివలె
నిలచియుండి పరిపాలన విధులను – తెలియబలుకుచుండు
దేశమందు నేడెన్నోరీతుల – ద్వేషము బలిసింది



బ్రహ్మనాయునకు నాగసానికి – పగలు మించెనయ్య
యిందుమూలమున యెన్నోచిక్కులు – రానున్నవి గాన
పెయ్యేండ్లున్న వేరుతప్పదను – సామెతవినలేద
పోరుమాపుటకు యింతకన్న – ఏదారిలేదులేదు
తీరిపోను యీ నాటితోమనకీ – తగవులు అన్నాడు

వ॥ నాటినుండి బాలరాజులు బ్రహ్మయ్య మంత్రిత్వమున మాచెర్ల సీమనేలుచుండిరి. నాగమ్మ మంత్రిత్వమున నలగామరాజు గురజాల పరగణాల యేలుచుండెను. బ్రహ్మనాయుని పరిపాలనలో మాచెర్లసీమ ఎలా యున్నదయా

మల్లిదేవులు – పాలించేసీను ॥తందాన–తందాన–తందన
ఎల్లవిధమ్ముల – విల్లసిల్లుచుండె ,,
ప్రజలపాలిట – పెన్నిధి బ్రహ్మన్న ,,
కోటగట్టె బల్ – నీటుగ బ్రహ్మన్న ,,
పల్లెపల్లెకో – పాఠశాలగట్టె ,,
పల్లెలందు – గ్రంథాలయాలుబెట్టె ,,
చెన్నునిగుడి మా – చెర్లయందు గట్టె ,,
అన్నికులమ్ములు – హారతులుబెట్టె ,,

వ॥ అప్పుడు—

రగడ – గౌడ రాగము

పెద్దలంత పరుగెత్తిరి నాయకి – వద్దకు వేవేగ
హద్దుమీరినది నాయునిపాలన – అమ్మా నాగమ్మా
మాలకూటిరాజ్యంబైపోయెను – అమ్మా మాచెర్ల
మాలపిల్లలు కాపుపిల్లలు – కలసి చదువుతారా ?

గాలిమేడలై మనకోరికలు - కూలిపోవునమ్మా
నాగమ్మా మమ్ముద్ధరించమని - సాగిలపడ్డారు
వ॥ ఆరీతి వాపోవు పెద్దలను వోదార్చి నాగమ్మ—

రగడ - శ్రీరాగము

నాగుమాంబ మాచెర్లనుజూచి - అసూయపడినాది
చాలకోపమున నాగుమాంబ నల - గామరాజుతోడ
కీలుబొమ్మ మంత్రిత్వము నాకిది - యేలపొమ్మనంది
వెళ్లెద నీ అధికారములే నీ - కొలువేలన్నాద
కండ్లుదిరిగి నలగామరాజు తా - కలవరపడి వేగ
నాగమ్మా నీచేతిబలుపునే - నమ్మితి నన్నాడు
నాగమ్మా నీ యిచ్చవచ్చినటు - యేలుము అన్నాడ

వ॥ యీ ప్రకారంబున సామదాన భేద దండోపాయం బుల నలగామ నరిసింగరాజులను లోంగదీసె. నాగమ్మ బాల రాజులకు నలగామరాజుపేరుతో ఒక జాబు వ్రాసె! యెట్లనా—

(తందాన వరస)

| | |
|---|---|
| శ్రీమన్మహావీర కామేంద్రవిభుడా | తందాన |
| మానభూషణులకు మల్లిదేవులకు | ,, |
| దీవించిపంపు సందేశమేమనగ | ,, |
| నేడు సంక్రాంతికి కోడేరు గుట్టకడ | ,, |
| కోడిపందాలా వేయనెంచాము | ,, |
| పందెంబునొడ్డు భూపాలకూలెల్ల | ,, |
| కోడికి నెదురొడ్డు కోడెగాండ్రెల్లా | ,, |
| పాల్గొన విజయంబు బడసిపోవచ్చు | ,, |
| అని యిట్లు నలగామరాజు కబురంపె | ,, |



వ॥ బాలరాజులతో బ్రహ్మనాయుడు కొలువై యున్న సమయమున ఈజాబుజూచి బ్రహ్మనాయుడుయేమంటున్నాడు—

రగడ - తిలకామోద్

కామరాజుకీ ప్రేమయెప్పుడు - కలిగిందన్నాడూ
కాదుకాదు ఆ రాజుపంపినది - కాదని అన్నాడూ
సంగనాచినాగమ్మ పన్నిన పన్నాగమె - నన్నాడూ
నాగసాని ఆడిందిఆట పాడింది పాటఆయె
యీయేటికి సంక్రాంతికి యీ ఎలు - బరెసెలు వస్తాయి
యీయేటికి నలగొండలపైగా - దూకును గుర్రాలు
చాలులే వద్దీ యీ అన్నదమ్ముల - సరసాలన్నాడు

వ॥ బాలరాజులు అది విని—

కామరాజు బలగాన్నిజూచి భయ - మందనేల మనము
యేమివ్రాసినా యెవరువ్రాసిన - వెళ్ళుదమన్నారు
మీరి వచ్చు నాగమ్మ బరిసెలా - పదునెంతన్నారు
పారుబోతు నాగమ్మ పుంజులా - పరువెంతన్నారు
వెళ్ళవచ్చు మాచెర్లకోళ్ళ పరవళ్ళు జూపవచ్చు
మనపుంజులు గురజాల కోళ్ళను - గోటజిమ్ముతాయి
అనవిని యెల్లరు భళీభళీ యని - పయనముగట్టారు

| | |
|---|---|
| అందేసిన పందెగాండ్లురా | ॥సై॥ |
| అందమయిన పుంజులెత్తిరి | ,, |
| పాతలుకత్తులు దీసిరి | ,, |
| సానలమీదే సాదిరి | ,, |

నూనెల మెరుగుబెట్టిరి ||సై||
గజ్జల చెడ్డీల్ గట్టిరి ,,
గంతులు వేయుచు కదిలారా

వ|| అటు గురజాలనుండి నాగమ్మ పక్షమువారు—

పేరుగొన్న పందెగాండ్లురా ||సై||
పోరుగల కోళ్ళనెత్తిరా ,,
సాధనజేసి వారురా ,,
సారాజాడీ బండ్లురా ,,
భేరీవాయిద్యాలురా ,,
జోరు జోరుగా త్రాగిరా ,,
దారులన్ని తెగనడిచారా ||భళానంటి||

వ|| యివ్విధంబున యిరుపక్షములవారును కోడేరు గుట్టలవద్ద అలరాజు మధ్యవర్తిత్వమున పందెముకు దిగిరట యెట్లనా ? నాగమ్మ పక్షమున మువ్వల భీమన్న, నాయుని పక్షమున బాలగోపన్న,

లెక్కతాడులే తీసిరా ||సై||
వొక్కొక్క పుంజునే జూచిరా ,,
యీకవరుసనే జూచిరా ,,
యెలపై పుంజులు దించారా ||భళానంటి||
నాయకి పుంజూ నాయసా ||సై||
నాల్గు ఝాములా పుంజురా ,,
బరిపక్కల పగలదన్నెరా ,,
బ్రహ్మయ్య పుంజే పారిందా ||భళానంటి||



వ|| మాచెర్లవారి పుంజు పారిపోవుటంజూచి నాగమ్మ వెంటవచ్చిన సుద్దులవాడు ఏమంటూన్నాడు—

పలనాటి మిద్దెలకు వాసాలు లేవు ||తందాన||
కొండేటి బ్రాహ్మలకు మీసాలు లేవు ,,
మాచెర్ల కోళ్ళకు రోషాలు - లేవయ్యా ,,

వ|| యీ పాట విన్న మాచెర్ల దొరలు—

భగ్గుభగ్గునే మండిరి ||సై||
పట్టి మీసముల దువ్విరి ,,
కరకరకోరలు నూరిరా ,,
కాకిడేగనే దించారా ||భళానంటి||
నీటైన బ్రహ్మయ్య డేగరా ||సై||
అరవడి పరవడి జేసెరా ,,
తాటించె తన్నసాగెరా ,,
నాగమ్మకోడి సోదరా ,,

తతక్కధోం—

కావుకావుమని అరచిందా ||భళానంటి||
కాలికిబుద్ధి చెప్పిందా ,,
తవుడు మేసినా కోడిరా ,,
తన్నుకు పారిపోయిందా ||భళానంటి||

వ|| యీ రీతి గురజాలకోడి పారిపోవటంజూచి మాచెర్ల వారి వెంటవచ్చిన సుద్దులవాడు ఏమంటున్నాడు—

పలనాటి మిద్దెలకు వాసాలు లేవు ||తంధాన||
కొండేటి బ్రాహ్మలకు మీసాలు లేవు ,,
గురజాలకోళ్ళకి రోషాలు లేవయ్యా ,,

రగడ - మాండు దురితము

గురజాల వీరులు రోషమెక్కి-బల్ - కొరకొరలాడంగ
కామరాజు గుడ్లురెజేసి బల్ - తామసమున లేచి
కాచుకొండి కడసారి పందెమని - గదిమి పలికినాడు
వోడినవారము రాజ్యమువీడుద - మేదు యేదు లనియె
రోషంబున గురజాలవీరులు సైసై యన్నారు
గెలుపుకోపులో బాలరాజులు - భళిభళి యన్నారు
రాజుకున్న యీ కోడిపోరు - రారాజుల పోరాయె

వ॥ అలరాజు బ్రహ్మనాయుడు కూడదని ఎంతజెప్పినా వినక యిరుపక్షములువారు కడసారి పందెములకు గడంగిరి. యెట్లనా—

మాచెర్లరాజులూ నాయనా ॥సై॥
జాతికోడినె దించిరా ,,
నాయకురాలు సోదరా ,,
పుంజుల్లోపుంజు గానిది ,,
పెట్టల్లోపెట్ట గాదిది ,,
పెట్టమారినె దించిందా ॥భళానంటి॥
నీకైన మాచెర్ల పుంజురా ॥సై॥
నోటబట్టి పెట్టమారిని
దెబ్బమీద దెబ్బకొట్టెరా
పెట్టమారి నేల గరిసిందా
కాళ్ళువణికి నాగమ్మకు ॥సై॥
కళ్ళుతిరిగె నాగమ్మకు ,,
జిత్తుంమారి నాయకి ,,



నెత్తురుజెండా, యెత్తెరా ॥సై॥
జుట్టును తావిరబోసెరా ,,
దయ్యములాగా నాయకి ,,
ఆ కయ్యములోనా నిలచిందా ॥భళానంటి॥

వ॥ నాగమ్మ ఆకారాన్నిచూచి తన దృష్టినిమరల్చి బ్రహ్మయ్య తలవంచుకొనెను. నాగమ్మ యిదే సమయమని భీమన్నకు సౌజ్ఞ చేసెను. అంత భీమన్న పెట్టవగారిని బ్రహ్మయ్య పుంజుపైకి వుసికొల్పగా —

నోటబట్టి బ్రహ్మయ్య పుంజునేకొట్టె పెట్టమారి.

"గీ॥ బ్రహ్మనాయుని యింజారి బెరసపుంజు
నెత్తురు బ్రేవులు జీరాడ నింతికగసి
పెట్టమారిని రెట్టలు చిట్లదన్ని
జీవతులు బాసె మాచెర్లజాతి పుంజు.

గీ॥ చావకనె పారినది గురజాలమారి
చమరి బరిమీద నొరిగె మాచెర్లపుంజు
ధర్మ నిర్ణయ మగుదాక తడయకామె
కసరి నాగమ్మ వేయించె కంచుఢక్క."

(త్రిపురనేని రామస్వామి చౌదరిగారు)

నాగమదేవికి జైయని లేచెను నాగమ్మ మూకంత
సాగెను యీలలు చప్పట్లు బహు - ఆగమాగమాయె

వ॥ అప్పుడు నాగమ్మ బ్రహ్మనాయునితో యేమంటుంది

రగడ - రాగము ఆనందభైరవి

పందెమంటునా వోడిపోతివా - బావా బ్రహ్మయ్యా
పందాలకు పై పందాలకు - దిగవద్దని చెప్పితినే
చనటి ప్రతిష్టకు బోకమీరు - మాచర్ల నేలుకోండి
పందెము వేయకు బావా మా గురజాలతో యికముందు

వ॥ అన విని బ్రహ్మయ్య—

బ్రహ్మనాయని కంటికొనలో - విషాదము వాలికిందా
కానినాడు పరుసాలకు బోయిన - ఫలమిదియన్నాడు

వ॥ అప్పుడు వారంతా—

ఆడినమాటను తప్పక దేశము - వీడుదమన్నాడు
అడవులపాలయి ఆకులలము తిని - ఆకలి నాపుకొని
నడచి నడచి పడరానిపాట్లు బడి - మేడపి చేరారు

వ॥ యీరీతిన నాయకురాలి మాయజూదమున వోడిన బాలరాజులు బ్రహ్మనాయుడు బంధుమిత్ర సకుటుంబ సమేతంబుగా వీరమేడపిలో నివసించుచుండ—

వీరమేడపిలో యేడు యేడులు - గడచిపోయెనయ్యా
తీరిపోయినది గడువనివారికి - తేటపడిన పిదప
అలరాజును తమ రాయబారిగా - అంపిరి గురజాల

వ॥ రాయబారిగా వచ్చిన అలరాజు కొలువున ప్రవేశించి కుశల ప్రశ్నలైన యనంతరంబు నలగామరాజుతో తన రాక నెరింగించె యెట్లనా—మామా!



గీ॥ మీరు బెట్టిన గడువెల్ల తీరెనయ్యా!
వారి మాచెర్ల నిక మీరు వారికిచ్చి
బంధుమిత్రులు తగవులు బాపుడయ్యా!
సుగుణధనులార! గురజాల సుజనులార!

రగడ మోహనరాగము

అని యివ్విధమున బల్కుచున్న - అలరాజుతో నాగమ్మ
తలకొకముక్కను జేసినదేశము - బలముతగ్గిపోయి
కాకులుచింపిన విస్తరిలాగా - కాకమానదయ్యా
మాలకూటి రాజ్యమైపోయెను - మాచర్లానాడు
మాలకూటి రాజ్యమ్ముమేలు చే - కూర్చదు నలరాజా
ఎంతోకాలము ఏలబోదు మీ - మామ కామరాజు
మీకూ మాకూ అందరికైక్యత - మేలగు నలరాజా
నేడో రేపో నీవీరాజ్యము - నేలుదు నలరాజా

వ॥ అన విని అలరాజు అమ్మా నాగమా! యిప్పటి నీ మేలు యింతవరకు వచ్చింది. యికచాలు తల్లీ! మామాన లగామరాజా! యింతవరకు కన్నతండ్రివలె మిమ్మెత్తి పెంచి మీ మేలే తనమేలుగా భావించి నడిపించెడి—

పాట

బ్రహ్మన్న మాటలను మామా వినుమా
పగను వృద్ధిబొందించు భ్రష్టులే
పోరుమాన్పు పుణ్యాత్ములు లేరు
పోరు నష్టి పొందు లాభ మందురు
పోరు తగదు భూమి నేరికైనా మామా॥
బ్రహ్మన్న మాటలను - మామావినుమా

వ॥ అలరాజు మాటలాలించి నలగామరాజు నాగమ్మ వంక జూచె.

రగడ — శ్రీరాగము

కన్నులు నిప్పులురాలగ నాగమ - అలరాజును జూచి
కటకట కోరలు నూరుచు నాగమ - గదిమి పలికినాదా
తెలుసునులే నీతిబోధ హొమ్మన్నది నాగమ్మా
గెలుచుకొంటిమీ రాజ్యము మేమూ - బాలరాజులొద్ద
రాజ్యము వీరభోజ్యమన్నదే - రాజనీతి రాజా
బిచ్చబెట్టునదికాదుపోవయా - రాజ్యం అలరాజా
రోసమున్నచో - మమ్ముగెల్వమని పలికెను నాగమ్మ

వ॥ అప్పుడు అలరాజు అమ్మా నాగమ్మా!

రగడ - కన్నడ రాగము

పందెముబెట్టి అన్నదమ్ములా - పగలుబెట్టినావూ
కలతలెరుంగని పలనాటికి - గతులు తెచ్చినావూ
యింకపైన నీ వేమిచేతువో - చేయుము నాగమ్మా
యేమిజేసినా నీ కెదురేదీ - సీమలో అన్నాడు
నాకెందులకి గొడవులన్ని - నేనేగెద తపమునకు
కృష్ణా రామా యనుచు తడవును - గడిపెద నన్నాడు

వ॥ అని యీ ప్రకారంబునా అలరాజు కొలువువీడి వెళ్ళుచుండ—



వ॥ అప్పుడు నాగమ్మ నరసింగరాజుతో—

రగడ - మోహనరాగము

పలనాటికి పట్టాభిషిక్తుడీ - అలరాజన్నాది
అలరాజేమీ అన్నకు ముద్దుల - అల్లుడు అన్నాది
అలరాజే నీ పక్కలో బల్లెము - తెలియుమ నన్నాది
ఆలోచింపక నీ పిడికత్తికి - బలియిడు మన్నాది

వ॥ యివ్విధంబున నాగమ్మ నరసింగరాజులు అలరాజును హత్య చేయించే ప్రయత్నంలో వున్నారు.

యిక అంతఃపురంలో పేరిందేవి యెలా వుందయ్యా? యేడేండ్లనాడు పెండ్లి ముచ్చటయినా తీరని స్థితిలో వెళ్ళిన భర్త తిరిగి యీనాడు తన మేడకు వస్తాడని ఆనందంగా యెదురుచూస్తూవుంది. యీ పరిస్థితిలో నలగామరాజు యెలా వున్నాడయ్యా—

కన్నులనిండా నీరునింపె నల - గామరాజు దేవ
ఎన్నిగతులు నా కింకపైన రా నున్నవో పరమేశ
కన్నతండ్రివలె పెంచిననాయుడు - కడకు దూరమాయె
ఎన్నో ఆశలు పెట్టుకున్న నా - అల్లుడలిగిపోయె
ఇరువురిమధ్యన నలిగిపోయె నా - జీవితాశలన్ని
దరిదోచని నలగామరాజు ఈ - తీరున నుండంగ

వ॥ తెల్లవారుసరికి నాగమ్మ నలగామరాజుకడకు చరచరా వచ్చి, రాజా నలగామరాజా! నీ అల్లుని అలరాజుని బ్రహ్మనాయుడు హత్య జేయించాడు. మన పొలిమేరలోన మన చుట్టుపట్లనున్న రారాజులు రాయబారిని చంపినద్రోహుల

మని మనకు సహకారులుగా రాకుండ వుండేటందుకు సహగమ
నము పేరిట అలరాజుతో పేరిందేవినికూడా మన సత్సాంప్ర
దాయంప్రకారం మనం కాల్చివేతుముగనుక రేపు తనచేతికీలు
బొమ్మలైన బాలరాజులను పలనాటికి పట్టాభిషిక్తు చేయ
వచ్చు. బ్రహ్మన్నయ్య ఈ దుర్మార్గానికి వొడిగట్టెనని, నాగమ్మ
అలరాజును పేరిందేవిని తలంచి దుఃఖపోతుండ అంతఃపురంలో
పేరిందేవి యీ వార్త విన్నంతనే—

ర గ డ

ధరణికివొరిగెను మొదలునరికినా అరటితుండమటుల
బిరబిరదాదులు సేదదీర్చినా పేరిందేవి నపుడు
తీర్చుకుంటివా నీ కర్తవ్యము తల్లీ నాగమ్మా
నిన్న నవలసిన పని ఏమున్నది నీతిమాకు లేదు

వ॥ అమ్మా నాగమ్మా! నా భర్తతో పాటు ఈ పాపిష్టి
పాలనా విధానాన్ని చూడకుండా నన్నూ పంపుతున్నందుకు
నీకు ధన్యవాదాలు తల్లీ! ఎందుకన నా భర్త అలరాజు—

ర గ డ

మానవత్వమును ప్రాణముకోసం మంటగలపలేదు
భోణముకోసం నీతినియమములు నీటగలపలేదు
ధర్మముకోసము బలియైపోయిన కర్మవీరుడతడు
ఎన్నిజన్మములకైనా నా పతి అతడే అలరాజు

వ॥ అని ఏడ్చుచు సహగమనానికి సిద్ధమై తొలిద్వారము
దాటి మలిద్వారమున అడుగిడినంత తన పినతండ్రి నరసింగ
రాజు ఎదురుపడినంత యా తల్లి పొంగిపొరలు దుఃఖమున—



ర గ డ

పిన్నయ్యా ఓ పిన్నయ్యా పిన్నయ్య నరసరాజ
కన్నయ్యకన్నా మిన్నగపెంచిన పిన్నయ్యా వినర

వ॥ మొన్న ముద్దు ముచ్చటగా మాకు వివాహం
నీ చేతులమీదుగా జరిపించి, దీవించి అత్తవారింటి కంపిన
పిన్నయ్యా, అట్టి నీ చేతులతోనే—

ర గ డ

దీవనలిచ్చి వల్లకాటి కిపు డంపర పిన్నయ్యా
అల్లునితోడుగ కూతునికూడా అంపర పిన్నయ్యా
మాయలేదురా పసుపుగుడ్డలే మాకో పిన్నయ్యా
పెండ్లిముచ్చటే తీరలేదురా పిన్నయ్యా మాకు
కదలిపోయెనా తల్లి గుణవతి కాటిదరికి యపుడు
కంటినీటితో భర్త పాదములు కడిగి పేరిందేవి
కాలిపోయెనా కాటిమీద నా కాంత పేరిందేవి

వ॥ యీ ప్రకారంబున అలరాజు మరణవార్త పేరిందేవి
సహగమనము రాయబారం విఫలమయిన వివరాలన్నీ వీర
మేడపికి తెలియవచ్చినంత బాలరాజులు బ్రహ్మనాయుడు
కార్యమపూడికి సైన్యసమేతంగా కదిలిరెట్లనా—

పా ట

జననాథుల జయభేరి మ్రోగ
పతాలమే కక్కటిల్లగ దిక్తటంబులే పెఠిల్ మనగ
రెట్టలుదట్టుచు హూంకరించుచు నినాద ఘోషలన్
నలుపగ విరోధులందరతి చింత తమ తలలు నిలకు
వంచగ అదే కనుడు ||జననాథులా||

మని మనకు సహాకారులుగా రాకుండ వుండేటందుకు సహగమ
నము పేరిట అలరాజుతో పేరిందేవినికూడా మన సత్సాంప్ర
దాయంప్రకారం మనం కాల్చివేతుముగనుక రేపు తనచేతికీలు
బొమ్మలైన బాలరాజులను పలనాటికి పట్టాభిషిక్తు చేయ
వచ్చు. బ్రహ్మన్నయ్యా ఈ దుర్మార్గానికి వొడిగట్టెనని, నాగమ్మ
అలరాజును పేరిందేవిని తలంచి దుఃఖపోతుండ అంతఃపురంలో
పేరిందేవీ యీ వార్త విన్నంతనే—

ర గ డ

ధరణికివొరిగెను మొదలునరికినా అరటితుండమటుల
బిరబిరదాదులు సేదదీర్చినా పేరిందేవి నపుడు
తీర్చుకుంటివా నీ కర్తవ్యము తల్లీ నాగమ్మా
నిన్నసవలసిన పని ఏమున్నది నీతిమాకులేదు

వ॥ అమ్మా నాగమ్మా! నా భర్తతోపాటు ఈ పాపిష్టి
పాలనా విధానాన్ని చూడకుండా నన్నూ పంపుతున్నందుకు
నీకు ధన్యవాదాలు తల్లీ! ఎందుకన నా భర్త అలరాజు—

ర గ డ

మానవత్వమును ప్రాణముకోసం మంటగలపలేదు
బోణముకోసం నీతినియమములు నీటగలపలేదు
ధర్మముకోసము బలియైపోయిన కర్మవీరుడతడు
ఎన్నిజన్మములకైనా నా పతి అతడే అలరాజు

వ॥ అని ఏడ్చుచు సహగమనానికి సిద్ధమై తొలిద్వారము
దాటి మలిద్వారమున అడుగిడినంత తన పినతండ్రి నరసింగ
రాజు ఎదురుపడినంత యా తల్లి పొంగిపొరలు దుఃఖమున—



ర గ డ

పిన్నయ్యా ఓ పిన్నయ్యా పిన్నయ్యా నరసరాజ
కన్నయ్యాకన్నా మిన్నగపెంచిన పిన్నయ్యా వినర

వ॥ మొన్న ముద్దు ముచ్చటగా మాకు వివాహం
నీ చేతులమీదుగా జరిపించి, దీవించి అత్తవారింటి కంపిన
పిన్నయ్యా, అట్టి నీ చేతులతోనే—

ర గ డ

దీవనలిచ్చి వల్లకాటి కిపు డంపర పిన్నయ్యా
అల్లునితోడుగ కూతునికూడా అంపర పిన్నయ్యా
మాయలేదురా పసుపుగుడ్డలే మాకో పిన్నయ్యా
పెండ్లిముచ్చటే తీరలేదురా పిన్నయ్యా మాకు
కదలిపోయెనా తల్లి గుణవతి కాటిదరికి యపుడు
కంటినీటితో భర్త పాదములు కడిగి పేరిందేవి
కాలిపోయెనా కాటిమీద నా కాంత పేరిందేవి

వ॥ యీ ప్రకారంబున అలరాజు మరణవార్త పేరిందేవి
సహగమనము రాయబారం విఫలమయిన వివరాలన్నీ వీర
మేడపికి తెలియవచ్చినంత బాలరాజులు బ్రహ్మనాయుడు
కార్యమపూడికి సైన్యసమేతంగా కదిలిరెట్లనా—

పా ట

జననాధుల జయభేరిమ్రోగ
పతాలమే కక్కటిల్లగ దిక్తటంబులే పెకిల్ మసగ
రెట్టలుదట్టుచు హుంకరించుచు నినాద ఘోషలన్
నలుపగ విరోధులందరతి చింత తమ తలలు నిలకు
వంచగ అదే కనుడు ॥జననాధులా॥

వ॥ యీవిధంబున పెద్దలంత యుద్ధానికివెళ్ళగ బ్రహ్మనాయుని కుమారుడైన బాలచంద్రుడు బొంగరాల ఆట కెళ్ళాడు. వెళ్ళినవాడు బొంగరానికి జాలెతాడుబోసి బజారు వెంట నీళ్ళుదెచ్చుచుండిన కోమటివారి అమ్మాయి కాలికి కొట్టాడు. అప్పుడు ఆ అమ్మాయి యేమంటున్నది—

రగడ – రాగము

పెద్దలుపిన్నలు నాగసానిపై – యుద్ధంబునకేగ
ఆడుచుంటివా బొంగరాలు నీ – అందమారిపోను
అనవిని బాలుడు అక్కటనిలువున – నీరైనిల్చినాడు
యెన్నితిట్టినా బదులుపలుకక – యోగాలపోయాడు

వ॥ వెంటనే బాలుడు ఆమెకు క్షమాపణజెప్పి తల్లి దగ్గరకొచ్చి నమస్కరించి—

పూజనీయుడౌ తండ్రియెక్కడికి – పోయనమ్మనేడు
పెద్దలందరును యుద్ధముజేయగ – పోయినారటమ్మ
కార్యమపూడికి పోయినారురా – కన్నతండ్రినేడు
కామరాజుతో కార్యముతీర్చక – కదలేవస్తారు
పాలుగారు పసిపాపలుమీరట – కేగరాదుతండ్రి
తల్లిరో యెంతటిమాటలింటి – మీనోటివెంటనేడు
వీరుడైన బ్రహ్మయనాయునికి – యిల్లాలువునయ్యు
పిరికిమందును కన్నబిడ్డలకు – నూరిపోయతగునా
వెరపుచెందునా కొరసింగము – కరినిగాంచినపుడు
అలగి సంద్రముప్పొంగిననాడు – ఆగునలోకాలు
దీవెనలిచ్చి పంపుమమ్మయని – ధీరతపలికాడు



వ॥ అప్పుడు అయితాంబ దీవించి, నాయనా! నీ భార్య మాంచాలితో చెప్పి ఆమె దీవెనలును అందుకొని పోయిరమ్మన బాలుడు మాంచాలి మేడకు పయనమయ్యె. భర్తరాక నెరింగిన మాంచాల బాలుండు పరికించుచుండ, యంతలో బాలుడరుదెంచి—

రగడ – రాగము

యేడువారపు నగలనుబెట్టిన – యింతినిజూచాడు
పట్టుది జలతారు చీరగట్టిన – పడతిని జూచాడు
పున్నమచంద్రుని ధిక్కరించునా – పసిడిబొమ్మనరసి
కన్నుచెదరి కామాంధకారమున – తన్నుతానే మరచి

ఆమె అందము పొగుడుతాడా ॥సై॥
ప్రేమభిక్షను వేడుతాడా ,,
కామాన్ని తీర్చమంటాడా ,,
కౌగిట చేర్చమంటాడా ॥భళి॥
నన్ను మన్నించమంటాడా ,,
నిన్ను విడనాడనంటాడా ,,
పిచ్చియెత్తిన కోతిచందాన బాలుడా
వచ్చినపని మరచినాడా ॥ఓ భారతీయుడా॥

వ॥ అపుడు మాంచాల, నా[illegible] వెన్నముకైన యువతీయువకుల[illegible]రధులమై కర్తవ్యాన్ని మర్చిపోయినట్లైతే—

పాట

నగరా నినుజూచినా – బాలచంద్ర ॥నగరా॥

పగతురు విన్నచో – ॥నగరా॥

దేశము హరియించి – అలరాజునోధియించి
పాలించు నాగమ్మ పసతేల్చుకొని రమ్మా
శత్రు యుగములు క్రుమ్మి చిమ్మి
ధాత్రిపై విజయమ్ము తెమ్మా
బానిసత్వము నోర్వలేము
బ్రతికినా చచ్చినా స్వర్గము ॥నగరా॥

సింగాల జగడమా – రంగాన జరుగగ
అంగాన చెలిమేమీ – సింగారముగ నుండు
రక్తతిలకము నుదుటబెట్టి
కరకుకత్తి కరముబట్టి
శత్రుమూకను చెదరగొట్టి
జయము చేకొనకున్న శత్రులు ॥నగరా॥

వ॥ అనవిని బాలుండు ఓ మాంచాలా! అందంబుల గనివైన నిన్ను గాంచినంత మనసు మనసులో లేక అట్లంటి. దీవించిపంపవే దేవీ మాంచాలా అన. అపుడు మాంచాల—

గీ॥ ధర్మయుద్ధము కేగెడి కర్మవీర !
చేరి శత్రుల నెదురించు వీరబాల !
యుద్ధమందున నీక తికెదురు లేదు !
తెమ్ము విజయమ్ము ! యిదె కృపాణమ్ము పొమ్ము !

వ॥ భార్య దీవెనల నందుకొన్న బాలుడు—



అగ్గురు తమ్ములు అన్నా బాలుడు – అశ్వంబులపైన
అంబరవీధిన కారెమపూడికి – అపుడే వెళ్ళారు

వ॥ అక్కడ కార్యమపూడిలో మరల పంపిన భట్టుమూర్తి రాయబారము విఫలమయ్యెనని బాలుడు విని యేమంటున్నాడు—

రగడ – రాగము

అడిగిన మాచెర్లివ్వనన్నది – అంతా మీదంది
యేమైనా మాచెర్లను మనకు – యిస్తేనే సంధి
కాదంటె యిక ఘోరయుద్ధమున – జయించి తీరాలి
నాగుమాంబ తంత్రాలముందు – బలిజంతువు లవుతారు
సిగ్గువీడి యీ రాయబారమున – కొగ్గితిరా తలలు
సంధిలేదు ముమ్మాటికి లేదు – సాగండన్నాడు

వ॥ యింతలో ఒక సేవకుడొచ్చి దేవా! బ్రహ్మయ్యనాయుడా—

రగడ

దండుతోడ నాగమ్మ కారెమపూడికి – కదిలింది
అంతులేని ఆ సేనావాహిని – అజేయముగ నుండె
యిసుకజల్లినా పడనెడమేమియు – పుడమిపైన లేదు
నాగులేటి దరిదాపుకె వచ్చెను – నాగమ మూకంత

రగడ

రాజులను సరదార్లను కూలీ – రైతుల జూచాడు
మాలకన్నమను బాలచంద్రుని – మన్నన జూచాడు
నాగమసేనలు కత్తిమోతకె – తగవు యుద్ధమునకు
మాలకన్నమా సేనానిగ రణ – భేరీ వేయమనె

వ॥ యింతలో—

రగడ

సింహనాదమె చేసెను నాగమ - సేనలో చెలరేగి
తన కెదిరికి భేధంబు తెలియని - తికమకగా నుండె
ప్రళయకాళివలె నాగసానియు - పయనము అయినాది

వ॥ అంతట బ్రహ్మాయ్యనాయుడు—

రగడ

రణవీరకోణం బట్టినో ॥స్త్రై॥
రణమో రణమో యంటనో ,,
కన్నమదాసే కదలెరా ,,
సేనలన్ని చెలరేగాయా ॥భళానంటి॥

వ॥ యీ ప్రకారంబున సేనలన్నీ—

పట పట పట పట పండ్లు గొరుకుచును - పటుతరగతి వేగ
కట కట కట కట కోరల్లోరిపిడికి - చిటపటయన నిప్పుల్
రెట్టలు దట్టుచు అరేరేరేయని - మిట్టిపడుచు వేగ
పొట్టిమీసములు పట్టిదువ్వి - కనుబొమలు ముడియబట్టి
పరాకత్తులూ కరాల్లుబాకులు - తిటాలునందుకొని
పెటిల్లుమని కక్కటిల్లుచును - దిక్తటంబు లదరగను
గండ్రగొడ్డండ్లు కత్తులుబాణా - కర్రలు చేబూని
వేండ్రమైన రోకండ్లు గుదపలును - బిండివాలములును
తళతళనాకసమందు మెరయగా - తలపడెనిరువాగు
కరులు సేనలను నురుమాడుచు - మున్ముందు కేగుచుండ
రణభేరి ధణధణలకు ధరణి - దద్దరిల్లుచుండ
శరవేగంబున శత్రుసేనలో - చొరబడి బాలుండు



ధరణిమీద నరివీరులతలలు - తరుగుచు బాలుండు
విచ్చుకత్తి నరివీరులరొమ్ముల - కుమ్మిచిమ్ముచుండ
గుండెలు ప్రేవులు వొక్కుమ్మడిగా - తుండెములై జార
కొండలరీతిగ శవములన్నియు - గుట్టలుబడుచుండ
నెత్తురుచిమ్ముచు తలలు మొండెములు - దొర్లాడుచునుండ
శత్రుసేనలు చెదరిబెదరెను - చెట్లకు గుట్టలకు

వ॥ యీరీతి వూరిమార్గమున పారిపోవు సేనల పురి
కొలుపుచు నరసరాజు ముందు కురవడించగా—

రగడ - రాగము

మిడిసి భగ్గుమని మండుచు చిచ్చరి - పిడుగు చందమున
నరికివేతు నరసింగరాజయిక - రమ్మని బాలుండు
యెదురుబళ్ళ యుద్ధానికి తలపడె - నిద్దరు సరదార్లు
రెండుకొండ లొక్కుమ్మడి ఢీకొను - గండుమిగులుచుండ
సూటిగ బాలుని డొక్కలొబల్లెము - నాటెనరసరాజు
వేటుబడ్డపులి బిడ్డచందమున - గీటుచు దంతములు
తెప్పరిల్లి, నరిసింగరాజుపై - కుప్పళించిదూకి
దెబ్బకు నరికెను నరసరాజుతల - దొర్లెధరణిపైన

వ॥ యిట్టి సంకుల సమరమందు కొమ్ముపొట్టేళ్ళు కోడి
గిత్తలు కుమ్మి చిమ్మివేయుచుండ—

రగడ

వందలాది ప్రజకూలిరా ॥స్త్రై॥
వీరులంత నేలకొరిగిరా ,,
మలిదేవరాజులు చెల్లిరా ,,
కన్నమదాసే కూలాడా భళానంటి

వందలమందిని కూల్చిరా  సై॥
వైరిబల్గముల చీల్చెరా  ,,
పల్లనాటి పులిబిడ్డరా  ॥భళా॥
బాలుడు భువిపై వ్రాలాడా  ,,
అన్నదమ్ములా రక్తము  ||సై||
నాగులేరై పారెరా  ,,
మొండెములన్ని నాయసా  ,,
యెత్తిపోతలే దూకాయా  ||భళా||
రక్తమందునా డోకుచు  ||సై||
యెత్తినకత్తిని దించక  ,,
శవాలపై నాగమ్మను  ,,
నాయుడు బ్రహ్మయ్య చూచాడా ॥భళానంటి॥

వ॥ ఓ నాగమ్మ!

రక్తదాహము తీరక యింకా - కత్తిబట్టినావా
అన్నదమ్ములను చీలదీసి - యిట్లందర్ని చంపావా
పాలనాటి కులస్త్రీలపుస్తెలు - పసుపుకుంకాలు
నేలగలిపితివి నాగమ్మా నీ నీతి పాడుగాను
కట్టుకొనుము యీ శవాలగుట్టను - పట్టము అన్నాడు
యేలుకొనుము యీ శ్మశానభూమిని - యేకఛత్రముగను
వెళ్లుచుంటిని తపముజేసుకొన - తల్లీ నాగమ్మ
అని బ్రహ్మయ్య నలగొండలవంకకె - అడుగుబెట్టినాడు

వ॥ యింతలో—



పోరున నోరిగెడి వీరులవలె రవిజారె పశ్చిమాద్రి
వీరయోధులా వేడిరక్తమటు తెర్రబారె నింగి
కత్తులరీతిగ కారుచీకటులు క్రమ్మెను నల్దిశల
గోడుగోడుమని ఏడ్పులు కొండలు మారుమ్రోగుచుండ
రాబందులు పెనుగ్రద్దలు రెక్కల చప్పుడు లేచిందా
కుక్కలు నక్కలు నాగమ చుట్టూ కూయసాగెనయ్యా
పల్లనాటియుద్ధము ముగిసింది వల్లకాడుజేసి

అన్నదమ్ములా పోరుతో  ॥సై॥
పతనమైన పల్లనాడురా  ,,
తెల్లదొరలచే జిక్కెరా  ,,
కొల్లగొట్టి పోయారురా  ,,
పాలుబారు పల్లనాడురా  ,,
కరువులకిరవై నిలచిందా  ||భళ||

సంపూర్ణము



★

